యజమానులు గావించిన అత్యాచారముల, అన్యాయముల
విషాదగాథను గాంధీజీ వినియుండెను. మిల్లుయజమానులు
కూలీలద్వారా ఎంతపని చేయించుకొనెడివారో దానికి తగిన
మజూరి యిచ్చుటలేదు. వారిచ్చు అల్పవేతనము పారిశ్రామి
కుల అన్నవస్త్రములకైనను సరిపోవుట లేదు. కూలీలు యజ
మానులకొరకు రక్తము నీరైపోవునటుల శ్రమపడుచుందురు.
కూలీలు అర్ధభోజనము చేసియుందురు. ధనికులు ధనమును
బ్యాంకులలో జమకట్టుకొనుచుందురు. ఇది గాంధీజీకి చాలా
అన్యాయముగను, అసత్యముగను తోచెను. ఆయన యీ
అసత్యమును తొలగింతునని సంకల్పించుకొనెను. అహమదా
బాదుమిల్లుయజమానుల, కూలీల విశేషవివరములను తెలుసు
కొనుటకు ఆయన అహమదాబాదుకు పయనమై పోయి పారి
శ్రామికులదుఃఖమయావస్థలను ప్రత్యక్షముగా దర్శించెను. వేత
నము న్యాయముగా వృద్ధిపొందినయెడల వారిదుఃఖకష్టములు
కొంతవరకు తొలగిపోగలవు అని గ్రహించెను. ఈసారి యజ
మానులను చూచెను. యజమానులలో కొందరు గాంధీజీని
మెరుగుదురు. కొందరు వ్యక్తిగతముగా ఆయనను గౌరవించు
చుండిరి. కాని వారిస్వార్థము, ఉద్దేశములకు వ్యాఘాతము
కలుగుచున్నదని మిక్కిలి అసంతుష్టి చెందిరి. వారు మధుర
వాక్యములతోను పారిశ్రామికులపై బాహ్యాకసానుభూతితోను
గాంధీజీకి ఇటుల తెలియజేసిరి. 'మాకు మాకూలీలకు మధ్య
గల సంబంధము తండ్రికొడుకులసంబంధమువంటిది. అట్టివిష

యములో ఇతరులు జోక్యము కలుగజేసికొనినయెడల మేము సహించజాలము. ఇందులో ఇతరుల జోక్య మెందుకు ?'

గాంధీజీకూడ మందహాసముతో తెలియజేసిన దేమనగా- మీమాటలు చాలా తియ్యగా నున్నవి. కాని మిథ్యచే పరిపూర్ణమై యున్నవి. నిజముగా మీరు కూలిలక్షేమమును కోరుట లేదు. నోటితో తండ్రికొడుకులసంబంధమని చెప్పుచున్నారు. నిజముగా మీకట్టిఅభిప్రాయమే యున్నయెడల వారికష్టములను తొలగించుడు. వారివేతనములను వృద్ధిచేయుడు.

మిల్లుయజమానులు కోపావిష్టులైరి. అయిష్టమును సూచించిరి. గాంధిజీ మధ్యవర్తిత్వమువలన ఎట్టిషరతులకును అంగీకరించలేదు.

గాంధీజీ ఆయనకర్తవ్యమును ఆలోచించెను. ఈవిషయములో కూలీలు ఆత్మనిర్భరశీలురగుటయే ఉత్తమమని తలంచెను. సత్యముకొరకు సంగ్రామము చేయవలయునని స్థిరసంకల్పము గావించుకొనెను. ఆయన కూలీలు, కూలీల నాయకులు సమావేశమైన సభలో తనసంకల్పమును తెలియ జేసెను. 'మీన్యాయమైన కోరికలను నెరవేర్చుకొనుటకు మీరు హరతాళము చేయవలయును.'

పారిశ్రామికులు యీప్రతిపాదనకు అంగీకరించిరి.

హరతాళకార్యక్రమమునుగురించి విశేషముగా వారికి గాంధిజీ తెలియజేసెను. సత్యాగ్రహమునుగురించి అందరును

్రహింపలేదు. సత్యాగ్రహపరిశాలికనుమాత్రము ఆయన వ్యక్తపరచెను. అందరును హరతాళము చేయుటకే నిశ్చయించుకొనిరి.

(1) యజమానులు మనకోర్కెలను నెరవేర్చువంత వరకు ఎవరును మిల్లుపనిలోకి వెళ్ళవలదు.

(2) ఈసమ్మెసమయములో ఎవరును శాంతికి భంగకరముగా ప్రవర్తించవలదు.

(3) ఏవ్యక్తి పనిలోకి పోవగోరుచుండునో ఆతనిని - లసంతపెట్టవలదు.

(4) కూలీలు భిక్షాన్నమును తినవలదు.

(5) సమ్మె ఎంతకాలము జరిగినను దృఢమనస్కులై యుండవలయును. డబ్బు లేనియెడల భోజనమునకు సరిపోవునంతవరకే కూలి చేయవలయును.

గాంధిజీ యీసమ్మెను అహింసా, సత్యాగ్రహముల పవిత్రబంధనములచేత బంధించెను. సత్యాగ్రహము, అహింసల మధ్య సన్నిహితసంబంధ మున్నదని గాంధిజీ పరీక్షలద్వారా తెలియబరచెను. సత్యాగ్రహమును, అహింసను ఆఫ్రికాలో ఆయన సమానముగా ప్రయోగించెను. భారతక్షేత్రములో కూడ ఆయన అట్లే ప్రయోగింపకోరుచున్నారు. అయితే భారతభూమిపై సత్యాగ్రహముతో అహింసాప్రయోగము సంభవమగునో కాదో, సఫలీకృతమగునో కాదో అనువిషయములో పరీక్షించుటకు ఆయన స్థానికసీమాబద్ధసమస్యల

యుండు దీనిఫలాఫలములనుచూచి నవుకట్టిరి. అందువలననే ఆయన విద్యావిహీనులును, మూర్ఖులునైన కూలీలను ప్రథమమునందే షరతులద్వారా బంధించెను. శాంతిభంగముచేయుటను, బలప్రయోగము చేయుటను నిషేధించెను. ఎవరియందైనను అన్యాయమును, సానుభూతిఅభావములనుగాంచి జగడమాడవద్దని నిషేధించెను.

సత్యాగ్రహము నీచాచరణము కాదు. ఉన్నతాదర్శములతో కూడిన శక్తివంతమగు పవిత్రసాధన— ఆత్మబలముచేతను, నీతిబలముచేతను బలవత్తరమైన వీరుని మహాసంగ్రామము, అందుచేత కూలీలు భిక్షమెత్తుటగాని అభావమునలన ఇతరులవద్ద చేయి చాచుటగాని ఆయన నిషేధించియుండెను. కాని అవుసరమునుబట్టి పరిశ్రమద్వారా ధనార్జన చేసుకొనవచ్చునని ఉపదేశము నిచ్చియుండిరి.

పారిశ్రామికుల మానసికశక్తులను ఉత్సాహితము గావించుటకు ఆయన ప్రతిదినము ఎడారిప్రదేశములో కూలీలసాధారణసభ గావించుచుండిరి. కూలీలు గుంపులు గుంపులుగా ఆసభలకు హాజరగుచుండిరి. గాంధీజీ ప్రతిదినము వారికి షరతులనుగురించియు, ప్రతిజ్ఞలనుగురించియు స్మరింపజేయుచుండిరి. కూలీలుకూడ తమప్రతిజ్ఞలలోను, ఉద్దేశ్యములలోను స్థిరసంకల్పులై యున్నటుల ప్రచారము చేయుచుండిరి. పతాకమును ధరించి పట్టణమంతయు ప్రదక్షిణము చేయుచుండిరి.

ఇరువదియొక్కదినమువరకు సమ్మె చక్కగా శాంతి యుతముగా పరిపాలింపబడెను. కూలీల యైకమత్యము, సంఘబద్ధభావము, దృఢత్వములగాంచి మిల్లుయజమానులు కూడ చింతాన్వితులైరి. కాని తుదివరకు దరిద్రులును, బుభుక్షువులు నగుకూలీలు తమపట్టుదలను, సంకల్పములను నిలుపుకొనజాలకపోయిరి. ఆకలిమంటచే వారు బెదిరిపోయిరి.

దళములోనివారు కొందరుకొందరు పనులలో ప్రవేశించుచుండిరి. కాని ప్రవేశింప నిచ్ఛగింపనివారు షరతులను భగ్నపరచి ప్రవేశించినవారిపై బలమును ప్రయోగించి ఆటంకము కలుగజేయుచుండిరి. కూలీలమనోబలము తగ్గిపోవుచుండెను. వారి మనస్సులలో హింసాభావము రగులుకొనుచుండెను.

గాంధీజీ తనప్రయత్నములు విఫలమగుట గాంచి అనుతప్తుడాయెను. అజ్ఞులు దరిద్రులునగు పారిశ్రామికులు సత్యాగ్రహము, అహింసలకు యోగ్యులు కాజాలకపోవుట చేతనే సమ్మె భగ్నమై పోవుచున్నదని గ్రహించెను. వారిని యోగ్యులనుగా చేయక సంగ్రామములోకి లాగి తెచ్చుట తనదే పొరపాటు అని గ్రహించెను— కాని తనపొరపాటును ఆయన తృణీకరింతురా?— ఎంతమాత్రము తృణీకరింపరు. ఆయన పొరపాటుకు ఆయనదోషమునకు కూలీలు ఫల మనుభవింపవలయునా— ఈదోషమునకు శిక్ష ఆయనయే

అనుభవించును. ఈదోషమును తన ఆచరణముద్వారా పరిష్కరింతును.

కూలీలకొరకు ప్రాయోపవేశముచేయ ఆయన సంకల్పించుకొనెను— యజమానులు కూలీల అభావఅభియోగములవిషయములో మీమాంస చేయువరకు నిరాహారదీక్ష వహించెదనని సంకల్పించుకొనెను.

గాంధీజీ ప్రాయోపవేశము ఆరంభించెను.

గాంధీజీ ఆచరణమువలన దుర్బలులగు కూలీల మనస్సులలో కలవరము పుట్టెను. వారిలో మానసికశక్తులు ఉద్రేకములయ్యెను. అనుతాపము ననుభవించుచుండిరి. కూలీలు మరల దృఢసంకల్పులైరి. కొందరు కొందరు గాంధీజీతో ఉపవాసము చేయ ప్రారంభించిరి. నిస్తేజమైన హరతాళము ఉత్సాహాగ్నితో మరల రగుల్కొనెను. పట్టణములో ఆందోళనము బయలుదేరెను. యజమానులలో కొందరు కలవరపడజొచ్చిరి. గాంధీజీ పరిస్థితులు చూచి భయపడిరి. సిగ్గుపడిరి.

కాని గాంధీజీ తనహృదయముద్వారా యజమానుల హృదయమును గ్రహించెను. కార్యములద్వారా తన ఉద్దేశమును నెరవేర్చుకొనజాలక ఉపవాసముద్వారా భయపెట్టి కార్యమును నెరవేర్చుకొనుటకును ప్రయత్నించుట అన్యాయము, పాపము అని ఆయన గ్రహించెను. యజమానులకు ఉత్తరములను వ్రాసి ఆయన నేరమును అంగీకరించెను.

'నా ఉపవాసములు మీ పద్ధతులను ఏమాత్రము మార్చుకోవలసిన అవసరము లేదు. నేను భయపెట్టుట లేదు. నేరమునకు ప్రాయశ్చిత్తము చేసుకొనుచున్నాను,' అని వ్రాసెను.

గాంధీజీ తనదోషమును అంగీకరించుచు వ్రాసిన ఉత్తరములను చూచుకొని యింకా తత్తరపాటు చెందిరి. నేరము చేసి తననేరమును నిష్కపటముగా అంగీకరించువారు ఎన్నడును, ఎవ్వరికిని అన్యాయముగాని, అమంగళముగాని కోరనుదలచుటకు వీలులేదు. గాంధీజీ దోషస్వీకారముచలన యజమానులు తమ దోషమును స్వీకరింప బ్రోత్సాహమును బడసిరి. వారు వారిఅన్యాయమైన పట్టుదలను, విడనాడిరి. వినమ్రులైరి. స్వేచ్ఛాపూర్వకముగా కూలీలవిషయములో తగిన యేర్పాట్లు చేసెదమని అంగీకరించిరి. ఉపవాసమును విరమించమని గాంధీజీని వేడుకొనిరి.

గాంధీజీ పరాజితుడై కూడ జయము నందగలిగెను. కూలీలవేతనమువిషయములో గౌరవజనకమైన యేర్పాట్లు జరిగెను. సమ్మె అంత మొందినను గాంధీజీవిషయము కొంత ముచ్చటించెదము. విషయము గాంధీజీ తనదోషస్వీకారవిషయములో చూపిన అభినవత్వము. ఈఆత్మదోషస్వీకారము' పొరపాటుగా గ్రహించుట గాంధీస్వభావము, ఒకవిశేషవైశిష్ట్యము. జీవితములో తాను దేనిని సంగతమైనదని తలంచెనో, దానిని దృఢముగా, నిర్భయముగా పరిజల

ప్రతివాదములను ధిక్కరించి, నిందావిమర్శనములను విచక్షి తముగాక ఆచరణముద్వారా నిరాకరించెను. తనకర్మలు, ఆదర్శములు, లేక మార్గములు తప్పుడుతప్పులని తెలుసు కొనెనో, ఆతక్షణమే ఆయన ఆతప్పులను నిష్కపటముగా అంగీకరించి, అందరియెదుట బాహాటముగా వెల్లడిచేసియుం డెను. డోమెన్ కోలండు అను మహానుభావుడు ఆయనస్వభా వమును వర్ణించబోయి యిట్లు నుడివెను— 'నేను పొర పాటు చేసితిని, ఈవిషయమును అంగీకరించుటకు ఆయన సర్వదా సంసిద్ధుడై యుండెను.'

ఆయనలో గలయీదోషస్వీకారఆదర్శనము ఆయన జీవితములో అనేకసార్లు మనము గాంచితిమి.

ఈసారి గుజరాతు ఖేడాజిల్లాలో జరిగిన సంఘటనము లనుగురించి వర్ణించెదను.

గుజరాత్ ప్రదేశములలో కృషకులకొరకు స్థానిక సర్కారువారు ఒకశాసనమును చేసియుండిరి. భూమిలో నాలుగవవంతు లేక నాలుగవవంతుకంటె తక్కువపంట పండినసంవత్సరము బీదరైతులు ఇవ్వవలసినపన్ను రద్దుచేయ బడునని ప్రకటింపబడెను. 1918 వ సంవత్సరము ఖేడా మొదలగు గ్రామములలో పంటలు సరిగా పండలేదు. నాలు గవవంతుసస్యములుకూడ పండలేదు. రైతులకు అన్నాభావము వలన ధనాభావముకూడ కలిగెను. వారు పన్నువిషయములో క్షమించమని స్థానికోద్యోగస్థులకు మొరపెట్టుకొనిరి. కాని

వారిమొర నిరాకరింపబడెను. అంతేగాక పాలుపంటల
కంటె పంటలు అధికముగా పండెనని ఉద్యోగస్థులు పైఅధి
కారులకు తెలియజేసిరి. ఆవార్తలనుబట్టి పన్ను వసూలు
చేయువిషయములో కఠినముగా వ్యవహరించవలెనని పైఅధి
కారులు ఉద్యోగస్థులను ఆదేశించిరి.

రైతులు అసహాయస్థితిలో పడిపోయిరి. ఏమిచేయ
వలసినదియు వారికి తెలియలేదు. ఇట్టిసమయములో ఈ
అన్యాయములు, అత్యాచారములనుగురించి గాంధీజీ విన
కలిగిరి. రైతుల యీదురవస్థలవలన ఆయనహృదయము
ద్రవీభూతమాయెను. ఆయన దళబలముతో ఖేడాలో ప్రవే
శించిరి. రైతులనుచూచి మాట్లాడిరి. వారిపంటలవిషయము
పరీక్షించిరి. వారితో నలువైపులనున్న పరిస్థితులను గురించి
సంప్రతించిరి. పన్నునుండి రక్షింపబడకపోయినచో రైతుల
అభావములపై అభావములభారము వేయబడును. వారికష్ట
ములకు అంతముండదు.

గాంధీజీ యీసారి చరమప్రతీకారమునుగురించి ఆలో
చించెను. ఆయన సహకారులతో విశేషాలోచనములు
సల్పినపిమ్మట రైతుల యీఅత్యాచారములకు విరుద్ధముగా
సత్యాగ్రహము చేయవలయుననియు స్థిరపరచుకొనిరి. ఈవిష
యములో రైతుపెద్దల అభిప్రాయములనుకూడ గాంధీజీ
తెలుసుకొనకోరెను. గాంధీజీ రైతులయెడల చూపుచున్న
సానుభూతివిషయము వారు రైతులపెద్దలద్వారావిని ఉత్సా

హితులైరి. ఆశాస్వితులైరి. సత్యాగ్రహము నవలంబించుటకు మహోత్సాహముతో అంగీకరించిరి.

కాని గాంధీజీహృదయములో చంపారణ, అహమదాబాదు విషయములు ఉజ్వలరూపము దాల్చెను. సత్యాగ్రహసంగ్రామము ఆరంభించుటకుముందు రైతులలో అహింసా సత్యనిష్ఠలను నెలకొల్పుటకు ఉద్యుక్తులైరి. ఆయనసంకల్పమును రైతులు గ్రహించిరి. సత్యమును పొందవలెనన్నచో సత్యమును అనుసరించుసంకల్పమును స్వీకరింపవలయును. సత్యముకొరకు వినయపూర్వకముగా కష్టములను వరించుటకును, అత్యాచార ఉత్పీడనములను సహించుటకును, మనోబలమును సంపాదింపవలయును.

ప్రతిగ్రామవాసులును, రైతులును, గాంధీజీవద్దకువచ్చి ప్రతిజ్ఞాపత్రములో సంతకము చేసిరి. 'మాగ్రామపంటలు నాలుగుఅణాలకుమించి పండలేదు. ఈవిషయము మే మెరుగుదుము. ఈకారణముచేత పన్నువసూలు రాబోవు సంవత్సరమువరకు ఆపుదలచేయించమని మేము సర్కారువారికి దరఖాస్తు పెట్టుకున్నను పన్నువసూలుచేయుట నిలుపుదల చేయలేకపోతిమి. అందువలన మేము ఇటుల ప్రతిజ్ఞ చేయుచున్నాము. సంవత్సరమునకు చెల్లింపవలసిన సంపూర్ణమైన పన్ను, లేక మాలో ఎవరిపన్ను కొంతబాకీయున్నదో, ఆబాకీయున్నపన్ను మేము చెల్లించుకొనజాలము. ఈపన్నువసూలు చేయుటకు సర్కారువారు శాసనప్రకారము ఏమిచేయు

బంధముతో చేయవచ్చును. దానికొరకు మేముకష్టములను సహింపగలము. మా భూములను వేలము వేయనోపుము లేక జప్తు చేయవచ్చును. అట్లయినను మేము మా చేతులతో పన్ను చెల్లించి మా ఫిర్యాదు అసత్యమైనదని ప్రమాణితము చేయజాలము. సర్కారువారు రాబోవుపన్నువసూలు అన్ని జిల్లాలలో నిలుపుదలచేసినయెడల, మాలో శక్తి ఉన్నవారు పూర్తిగాగాని, అంశికముగాగాని బాకీయున్నపన్ను చెల్లించుటకు సంసిద్ధులై యున్నాము.

సత్యాగ్రహము ఆరంభించబడెను. రైతులు పన్ను చెల్లించుటకు నిరాకరించిరి. అసమర్థుడు చెల్లింపలేకపోయెను. సమర్థుడు చెల్లింప నిరాకరించెను. ఉద్యోగస్థులు బాధింపజొచ్చిరి. అచ్చటచ్చట అత్యాచారములుకూడ ఆరంభించబడెను. రైతులమనోబలమును గట్టిపరచుటకు గాంధీజీ, ఆయన సహచరులు గ్రామగ్రామాంతరములకు తిరిగి అహింసాసత్యాగ్రహవిషయములలో ప్రచారము చేయమొదలుపెట్టిరి. అధికారులు కండ్లెఱ్ఱజేసినను భయపడవలదని వారు తెలియజేసిరి. వినయముతో. దృఢసంకల్పముతో ఉద్యోగులమాటలను పెడచెవిని పెట్టవలయును. వారు దెబ్బలు కొట్టినను దృఢసంకల్పముతో ఆదెబ్బలను భరించవలయును. అరెస్టు చేసినయెడల ప్రశాంతమనస్సుతో వారు తీసుకొనిపోయిన స్థానమునకు పోవలయును. కాని సకలసమయములలో నీసంకల్పములలో విశ్వాసవంతుడవై యుండవలయును.

సత్యాగ్రహరైతులను అధికారులు అరెస్టు చేసిరి. కాని రైతులలో నూతనోత్సాహము ఉదయించెను. నూతన శక్తి ఉద్రిక్తమాయెను. వారు ద్విగుణశక్తితో సత్యాగ్రహ సంకల్పములో నిమగ్నులైరి. ఉద్యోగస్థులు కొందరిని అరెస్టు చేసి తీసుకొనిపోయినప్పుడు విచారణాలయమంతయు జనారణ్యముగా పరిణమించెడిది. సత్యాగ్రహుల నిశ్చయభావమును చూచి అనేకమంది సత్యాగ్రహములో చేరుటకు సంకల్పించుకొనిరి.

అప్పుడప్పుడు కొందరిలో మానసికదౌర్బల్యముకూడ సంభవించెడిది. అందరును ఏకదీక్షతో నుండజాలరు. అందువలన అధికారులు వచ్చి వేలంవేసుకొనుటకు కొందరు తమ సామానులను ముందుగానే యింటిముందు సిద్ధముచేసి యుంచెడివారు. కొందరుకొందరు రహస్యముగా పన్ను కట్టుచుండెడివారు. కాని తుదకు ప్రకృతవీరులకే జయము కలిగెను. ప్రజలదౌర్బల్యమును తొలగించుటకు సత్యాగ్రహవరులు గాంధీజీతో సంప్రతించి నూతనమార్గము నొకదానిని అవలంబించిరి. పన్ను చెల్లించకపోవుటచేత సర్కారువారు రైతుల ధాన్యమును జప్తుచేసితిమని ప్రకటించిరి. సత్యాగ్రహవీరులు ఆయాదేశమును ధిక్కరించి పొలమునుండి జప్తుచేయబడిన ధాన్యమును బహిరంగముగా కోసుకొని తెచ్చుకొనుచుండిరి. ఒకసారి సత్యాగ్రహదళమువారు ఒకపొలమునుండి ఉల్లిపాయలను త్రవ్వి తెచ్చిరి. సర్కారువారు సత్యాగ్రహదళమును

అరెస్టు చేసిరి. దీనివలన ప్రజలలో ఉద్రేకభావము అధిక మాయెను. దుర్బలులు, భీరులైన వారిలోకూడ మరల సాహసము, చైతన్యము కలిగెను. మందగమనము వహించినసత్యాగ్రహప్రవాహము మరల నూతనవేగముతో ప్రవహించుచుండెను.

ఇంతలో రైతులమనోబలము, కష్టసహిష్ణుత చూచి సర్కారువారు విచారగ్రస్తులైరి.

దరిద్రులు, అసమర్థులునైన రైతులవిషయములో సర్కారువారిహృదయములోకూడ కొంతపరివర్తనము కలిగెను. సర్కారువారు తుదకు ఇట్లు ప్రకటించిరి. "సమర్థులు, శక్తిశాలురమాత్రమే పన్ను చెల్లించవలయును. దరిద్రరైతుల పన్ను క్షమించబడినది."

సర్కారువారు జిల్లాకలెక్టరుద్వారా తమఅభిప్రాయమును గాంధీజీకి తెలియజేసిరి.

గాంధీజీ సహచరులతో ఈవిషయములో సంప్రతింపులు గావించెను. సర్కారువారు రైతులపరిస్థితులను గ్రహించినారని తెలుసుకొనెను. సర్కారువారి ఆప్రకటన సంపూర్ణముగా సంతోషదాయకమైనది కాకపోయినను దానిని అంగీకరించెను. ఆయన సత్యాగ్రహమును విరమించెను. ఆసంవత్సరమునకు రైతులు బ్రతికిపోయిరి.

ఈఖేడాజిల్లాసత్యాగ్రహవిషయము భారతదేశమంతయు వ్యాపించెను. గాంధీగారి యీనూతనసంగ్రామమును,

సంగ్రామసాఫల్యతను గాంచి భారతదేశములోని తత్వాహత్త యను కోటీశ్వరులైన సాధారణప్రజల అంధకారములో ఆశా జ్యోతిని దర్శించిరి. వివిధదేశములనుండి భారతీయప్రదేశ ములనుండి పరిస్థితులను కనుగొనవాంఛగల అనేకప్రజలు ఆయనను దర్శించుచుండిరి. నిత్యము అనేక ఉత్తరములు వచ్చు చుండెను.

దేశీయులు ఆయన ప్రణాళిక విషయములోను సత్యా గ్రహవిషయములోను ఉత్సాహవంతులై యున్నారని తెలుసు కొనిరి. ఆయనకూడ సాధ్యానుసారముగా అచ్చటచ్చట ఉప న్యాసము లిచ్చుచుండిరి. ఆలోచనలు సల్పుచుండిరి. వార్తా పత్రికలద్వారా తనకార్యములను, నీతిని, ప్రణాళికను దేశ మంతయు ప్రచారము చేయ మొదలిడిరి. ఆయననీతిఆదర్శముల విషయమై మనము చాలా తెలిసికొంటిమి. కాని యిచ్చట పురాతనవిషయములను నూతనముగా భావించి గ్రహింతము. ఈసమయములో గాంధీజీ 'యంగ్ ఇండియా' 'నవజీవనము' అను రెండు పత్రికలను నడపుభారమును వహించెను. ఈ రెండుపత్రికలసహాయముచేత నే ఆయన తన ఆదర్శములను విశేషముగా ప్రచారము చేయసమకట్టెను. సత్యాన్వేషియగు మానవుడు సకలసమయములలోను అసత్యమునకు విరుద్ధము గాను, అన్యాయమునకు నిర్భయముగాను సంగ్రామముచేయు టయే ఆయనఆదర్శముల మూలసూత్రములు. అన్యాయ ముతో ప్రతివాదములు సల్పుము. అన్యాయముతో సహాయ

ప్రాకటన చేయుము. కాని ఆ ప్రతిపాదనమును సంపూర్ణసకరముగా పాలింపవలయును. ప్రతిపాదకార్యములలో హింస, నీచత్వము, క్రోధము మొదలగు దుర్గుణములు ఉండకూడదు. 'నేను చేసిన అంగీకరింపను. నీవు పాలింపను. ఇది అసత్యమైనది. ఇది అన్యాయమైనది. నాఅభిప్రాయముతో స్పష్టచిత్తముతో, నిలువబడుము. అన్యాయ, అసత్యకార్యముల నుండి విరమింపుము. అన్యాయములకు స్థాయి, ప్రదేశకారిగా అన్యాయకార్యములలో సహాయపడను. వినయముతో, శాంతముతో, ధైర్యముతో, మానసికస్థిరత్వముతో, ధీరత్వముతో, నిగ్రహముతో అన్యాయమును ప్రతిఘటింపుము. 'నేను సత్యాన్వేషిని, సత్యములో క్రోధము లేదు, హింస లేదు. స్వార్థభావము లేదు. నేను శాంతిని, వినయమును, దృఢత్వమును, దృఢత్వముతో వినయముతో ప్రతిపక్షులకార్యములకు ఆటంకముల కలిగించెదను. ప్రతిపక్షులు నాయుద్దేశములను, నా సత్యాచరణమును బహుశా గ్రహింపజాలరు. ఆటంకముల వలన నాపై కోపగింతురు. అత్యాచారములు గావింతురు. సత్యముకొరకు, ఆ అత్యాచారములను ధైర్యముతోను, వినయముతోను స్వీకరింపవలయునని స్మరించుకొందును. కష్టములను వరింతును. దుఃఖమును సహింతును. అవసరమునుబట్టి దెబ్బలు సహింతును. కాని సకలసమయములలో అత్యాచారిని గౌరవదృష్టితో చూచుచుందును. సకలపరిస్థితులలో అత్యాచారిని ప్రేమింతును. అత్యాచారిహృదయమును గౌరవిం

పోను. నాకార్యములు, పరివర్తన నిర్మలముగా ఉండెనేని, హృదయపూర్వకముగా నిష్కపటముగా యుండెనేని అత్యాచారిహృదయముకూడ కరిగిపోవును. విచారగ్రస్తమగును. సత్యముకొరకు నేను అత్యాచారములను, కష్టములను సహించుటచూచి ఆతనిహృదయము పరివర్తిత మగును.'

అపూర్వమైనది యీఅస్త్రము! ఈఅభినవయుద్ధకౌశలము కనిపెట్టుట నిపీడితమానవసమాజమునకు ఆశీర్వాదమువలె అవతరించినది. ఈ అస్త్రసహాయము కేవలము భారతదేశము తనముక్తిమార్గమును వెదకి కనుగొనుటయేగాక నాగరికప్రపంచములో నిపీడితమానవసంఘము, జాతులుకూడ నేడు యీఅస్త్రమహిమను గాంచి ముగ్ధులైరి. ప్రపంచములోని అశాంతి, యుద్ధములు, కౌటిల్యము పరిహరించి అందరును త్వరితగతిని దీనివైపునకు ఆకర్షింపబడుచున్నారు. ఈ సత్యాగ్రహ, అహింస, సహాయనిరాకరణములు గాంధీజీని ప్రపంచదృష్టిలో మహత్తరముగాను అవినశ్వరముగాను నొనర్చెను.

ఈవిషయములో అధికముగా చెప్పుటకుగాని, తెలియజేయుటకుగాని మాకు శక్తి చాలదు. అయితే యీసత్యాగ్రహము, అసహాయోద్యమము సందర్భమున గాంధీజీ నుడివినవిషయములను ఉదహరించి మావక్తవ్యమును సత్యమని నిరూపించగలము. ఆయన నుడివినది— "అసహాయోద్యమ సాఫల్యత సంపూర్ణనిర్మాణకార్యక్రమముపై ఆధారపడియుం

కును. స్వేచ్ఛాచారమునుండి క్రోధముత్పన్న మగును. సత్యాగ్రహములో హింసయొక్క అస్తిత్వము లవలేశ మున్నను జరుగనేరదు. హింసఅనగా వెనుకకు నడచుట, నిరపరాధమగు జీవితమును అనవసరముగా వ్యర్థము చేయుట.'

గాంధిగారి మహత్తరసత్యాగ్రహకౌశలమునుగురించి రోమెన్ రోలండు అను మహానుభావుడు ఒకచోట యిట్లు వచించెను— "ప్రతిపక్షులపై హింసను ప్రయోగించుట నిషే. ధించెను. కారణమేమనగా, ప్రతిపక్షులు హృదయపూర్వక ముగా భావించుచున్న కార్యములను వారు అంగీకరింపవలసి వచ్చును. ఒకరికి సత్యమని తోచినది మరియొకరికి భ్రాంతిగా తోచవచ్చును. హింసద్వారా ఎవరియందును ఉచ్ఛ్వాసము ఉదయింపజాలదు. సత్యాగ్రహులప్రతిపక్షులను ప్రేమద్వారా జయింపవలయును. విశ్వాసములో ప్రేమను జన్మింపచేయుట ద్వారాను, ఆత్మత్యాగికారభావముచేతను, బాధలను సాదర ముతో స్వీకరించుటద్వారాను జయింపవలయును. నిజముగా యిది యొకవిధమైన ప్రచారము. దీనిని ప్రతిఘటించుటకు పై జ్ఞానికుల, ధాతువుల అస్త్రములద్వారా సాధ్యపడదు. ఈ ప్రచారఫలితముచేతనే క్రీస్తుకాని, ఆయన అల్పసంఖ్యాగల శిష్యులద్వారా విశాలమైన సామ్రాజ్యమే జయింపబడినది.

ఈసత్యాగ్రహములో అంతర్గతమైన అహింసానీతిని కొందరు అపార్థము చేసుకొనవచ్చునను ఉద్దేశముతో గాంధీజీ అహింసనసత్యాగ్రహమునుగురించి విశేషముగా

స్పష్టముగా ఆలోచనము కల్పియుండెను. సత్యాగ్రహములోగల అహింసనీతియే సత్యాగ్రహప్రణాళికను యింత అభినవముగా గావించినది. మానవుని హింసద్వారాకంటె ప్రేమసహాయముతో శాశ్వతముగా వశీభూతునిగాను, స్వయత్నావలంబునిగను గావించుకొనవచ్చును. సత్యాగ్రహి ప్రేమవిశ్వాసము, త్యాగములవలన ప్రతిపక్షునిహృదయమును శాశ్వతముగా జయించును.

కాని ఆయన యీ అహింస పిరికితనముచేతగాని దౌర్బల్యముచేతగాని కూడుకున్న అహింస గాదు. ప్రతిపక్షులతో శక్తివలన పోరాడలేక నిరాశతో కూడుకున్న అహింసకాదు. ఒకదుర్బలమైన చిన్నకుందేలు శక్తిశాలియగు వ్యాఘ్రముతో యుద్ధముచేయుటకు అసమర్థురాలై వనములోకి పారిపోయి దాగియుండును. ఇది అహింసకాదు. ఇది పిరికితనముయొక్క లక్షణము. కాని ఒకవ్యాఘ్రము సింహముతో యుద్ధముచేయ సమర్థురాలయ్యు దానిని కాలిగోళ్ళతోనైనను ఆక్రమింప నిష్టపడలేదు— దీనిని అహింస యనవచ్చును.

నేను బలములో సమర్థుడను, శక్తివంతుడను, యోగ్యుడను అయివుండికూడ ప్రతిపక్షులపై హింసను ప్రయోగింపను, ప్రతిపక్షులను ఆత్మశక్తిద్వారా మనోబలము ద్వారా ప్రతిఘటింతును. వశీభూతులనుగా చేసుకొనుటకు ప్రయత్నింతును—

---

మహాయుద్ధము—విపన్నులగు ఆంగ్లేయులు.

గాంధీజీ ఆశ్రమకార్యములలోను స్థానికసత్యాగ్రహ కార్యములలోను నియుక్తుడై యున్నప్పుడు యూరోపులో ద్వితీయమహాయుద్ధగర్జనములు వినవచ్చెను. బ్రిటీషుశక్తి ఆమహాయుద్ధములో చిక్కుపడి పోయెను. బలశాలియైన, మహత్తరముగా నిర్మింపబడిన జర్మన్‌శక్తికి విరుద్ధముగా తనపరిమితశక్తిని సంపదను ప్రయోగించినను బ్రిటిషువారు జర్మనుల కబళమునుండి తమను రక్షించుకొనలేకపోయిరి. అప్పుడు తనశక్తిని వృద్ధి చేసుకొనుటకై ప్రపంచములో నాలుగుమూలలను తేరి చూచెను. తాను జయించిన విశాల భారతదేశము తన నేత్రములకు కనుపించెను. అది తనఆత్మ రక్షణకొరకు భారతదేశసంపదను, జనబలమును ఉపయోగించుకొనుటకు సంకల్పించుకొనెను. అది తన అధికారబలము చేత భారతదేశమును మోసముచేసి దానిసంపదను లాగి కొనుకొన మొదలుపెట్టెను. కాని భారతదేశజనశక్తిని అంత సులభముగా మోసము చేయజాలకపోయెను. అప్పుడు భారతదేశపు పూర్వదిక్కున ఆశాజ్యోతి ప్రకాశించనుండెను. భారతీయులు సంపూర్ణముగా జాగరుకులు కాకపోయినను క్రమముగా జడత్వమును, నిష్క్రియత్వమును పరిత్యజించి తమఅధికారముకు తమకోరికలను నెరవేర్చుకొనుటకు ప్రబల ప్రయత్నములు చేయుచుండిరి. ఆంగ్లేయుల కార్యములకు

నిషిద్ధముగా స్పష్టమైన నిర్ధారణ గావింపకపోయినను అంతర్గత అసంతోషమువలన లోలోపల కుములుచుండిరి.

సహాయ యుద్ధములో బలి యిచ్చుటకు భారత దేశ జనబలమును అనేక ప్రయత్నములచేతగాని కౌశలముచేతగాని, వివిధ ప్రలోభములచేతగాని, బలయుక్తులచేగాని తగినంతసంఖ్యను సంపాదించలేకపోయిరి. పురాతనమార్గములు వ్యర్థమగుటచే బ్రిటీషువారు నూతనకౌశలమును అవలంబించిరి. భారత దేశీయనాయకులకు ఆవేదనములను పంపిరి. బ్రిటీషువారికాపదల వలన భారతదేశమునకుకూడ ఆపదలు సంభవించును. వారు పరాజితులైన యెడల భారతదేశము నూతనశక్తిద్వారా ఆక్రమింపబడుటయేగాక పీడింపబడును అని యాఆవేదనములో తెలియచేయబడెను. అందువలన బ్రిటీషువారి ఈయుద్ధములో భారతదేశముకూడ హృదయపూర్వకముగా సహాయముచేయవలయును.— బ్రిటీషుజాతివారి పవిత్రమైన వాగ్దానవిషయముకూడ ఆఆవేదనములో చివర వ్రాయబడియుండెను. ఈసహాయమునకు మహత్తరమైన, హృదయపూర్వకమైన ప్రతిదానము చేసెదమని బ్రిటీషువారు సూచించిరి. భారతీయులు శాసనవిషయములో కోరుచున్న అధికారములను సాధ్యమైనంతవరకు ప్రసాదించెదమనియు వ్యక్తపరచిరి. భారత శాసనకార్యములలో వారు భారతీయులకు యోగ్యమగు న్యాయమగు అధికారము నొసంగెదమని ఉదహరించిరి.

ఇంగ్లీషువారు పంపిన యీఆవేదనమును నాయకులు పరిశీలించిరి. పరిశీలించియు శాసకులకార్యకలాపములపూర్వోత్త

హాసములను స్మరించుకుని సందేహించుచుండిరి. [illegible]ష్కులగు గాంధీజీమాత్రము సందేహించలేదు.

భారతవాసులహృదయములు క్రమముగా విదేశశాసకులపై వీతరాగము లగుచున్నవని గాంధీజీ గ్రహించెను. ప్రజలమనస్సులు తమ అధికారములను పొందుటకు చరమ సంగ్రామము నారంభించ తహతహలాడుచుండెను. కాని ఏది యెట్లున్నను తనస్వభావము ఆదర్శములనుబట్టి గాంధీజీ బ్రిటీషుసర్కారువారిని విశ్వసించెను. తమక్షేమముకొరకు బ్రిటీషువారు భారతీయులను శోషణచేసి, పీడించిరి. బ్రిటీషువారిఆపదసమయములో భారతదేశము తనదుఃఖకష్టములను మరిచిపోయి ఆపదలో చిక్కుపడిన బ్రిటీషువారికి సహాయము చేసినయెడల, యుద్ధసామగ్రిని, సైనికబలమును పంపించిన యెడల శోషణచేయుచున్న బ్రిటీషువారి మనస్సులుకూడ ఒకరోజున పరివర్తితములు కాగలవు. అత్యాచారితజాతిసహాయమును, సేవను జడిసి వారిహృదయములే మారిపోవును. భారతీయులపై వారు సానుభూతి కలిగియుందురు. కృతజ్ఞచిత్తముతో భారతదేశము గావించిన సహాయమునకు ప్రతిదానము చేయగలరు. గాంధీజీహృదయములో యీవిశ్వాసము కలిగెను. వైస్ రాయి చెమ్స్‌ఫోర్డు ఢిల్లీలో నాయకులను సమావేశపరచి బహిరంగముగా బ్రిటీషువారిఆవేదనమును తెలియపరచెను. అప్పుడు గాంధీజీ ఆఆవేదనమును అంగీకరించుటకు హృదయపూర్వకముగ ప్రయత్నించెను. ఆయనప్రయ

త్న్యమువల్లనే నాయకులు, జాతీయమహాసభవారు ప్రథమ మహాయుద్ధములో బ్రిటీషువారికి సహాయము చేయుటకు అంగీకరించిరి.

ఈ అహింసాపూజారి ప్రథమమహాయుద్ధసమయములో హింసాకాండకు ఎట్లు సహాయము చేసిరని ప్రశ్న ఉదయింప వచ్చును. అహింసా కర్మములను నిలుపుజేసి హింసాపూర్ణ కర్మములను ఏల అంగీకరించెను. ఇది మిగుల కఠినమైన ప్రశ్న. ఆనాడు ఆయన అహింసా శ్రేష్ఠత్వమును గ్రహించియు బ్రిటీషువారికి భారతీయుని స్నేహపటుత్వసత్వశీలములను చూపింపుటకే యీ ప్రతిపాదనమును అంగీకరించెను. ఈ ప్రతిపాదనమువలన ఆయన తనఅహింసానీతిని విసర్జించలేదు. ఆయన దానిని ఇంకను మహత్తరమైన నాదవాసనమున ప్రతిష్ఠితము గావించెను. కేవలము అస్త్రముద్వారా ఆఘాతము చేయుటయే హింసకాదు. అస్త్రముద్వారా ఆఘాతముచేయక మానవులను మానవులు, జాతులను జాతులు అధికముగా హింసపెట్టగలవు. ఒకజాతివారిని మరియొక జాతివారు అధికముగా పీడింపగలరు. అందువలన ఆయన మానసికహింసలను త్యజించమని ఒకదృష్టాంతమును కనబరచి యుండిరి. శాసకులకు అబలముచేత బుద్ధి చెప్పలేకపోయినను, శాసకులకు సంభవించిన ఆపదసమయములో వారికి సహాయముచేయక, ఉపేక్షాభావము చూపించి లోలోపల యీర్ష్యాద్వేషములను పెంచుకుని, హృదయములోని కాప

న్యముచేత బాహ్యకహింసలను దాచియుంచుట గాంధీజీతత్త్వ ములకు విరుద్ధమైనది. అందువలన బ్రిటీషువారు సహాయముకొరకు గావించిన ప్రార్థనకు జవాబొసంగక విరామముచే స్వాంతదేశము మౌనము వహించి నిశ్చేష్టత్వమువలన శాంకలు ధ్వంసమగుగాకయని కోరుట గాంధీజీతత్వములకు విరుద్ధమైన విషయము. ఆయన భారతీయుల యీమానసికహింసను పరిహరింపజేయుటకే బ్రిటీషువారికి సహాయము చేయ సంకల్పించెను. భారతదేశఆత్మశక్తిని లోపలనుండి అహింసాతత్వములతో జాగరితముచేయ సమకట్టెను. అందువల్లనే ఆయన సైన్యముద్వారా భారతీయుల అకపటహృదయము బ్రిటీషువారికి తెలియచేయకోరెను.

ఆయనయొక్క యీఅహింసావిషయములో ప్రజలు పొరపడకుండునట్లు హింస అహింసలవిషయమై అనేకసత్యములను మనకు బోధించియున్నారు. అహింస దైహికకార్యము కాదు, మానసికకార్యము. మనస్సులో సంపూర్ణహింసను ధరించి పైకి అహింసానుభూతి నిదర్శనములను ప్రదర్శించినయెడల అది తీవ్రతరహింసయని గాంధీజీ తలంచెను. హృదయములో బ్రిటిషువారిపై విద్వేషము నుంచుకుని పైకి దానిని ప్రకటింపచేయకనిరపేక్షాభావముతో సత్యసంధుడనని తలంచుటకంటెను, ఈరహస్యమైన అసహ్యమైన హింసకంటెను బహిరంగముగా అస్త్రములతో యుద్ధము చేయుటయే మానవునకు ఉత్తమమార్గము.

భారతీయుల సహృదయతను గురించి నేయితర ప్రత్యక్ష ప్రమాణములను బ్రిటీషు వారి పక్షమున ప్రదర్శింపక పోయినను భారత దేశమునుండి అస్త్రసహాయము చేయ ప్రయత్నించెనని గాంధీజీ కూడ అంగీకరించెను. ఈ సహాయము చేసినప్పటికిని అస్త్రబలము, సామరిక శక్తులపై ఆయన శాశ్వతమైన అనాదరము అవిశ్వాసము కలిగియుండిరి.

గాంధీజీ శాసకులయెడల యిట్టి ఔదార్యమును చూపించెను. మరల తనహృదయములోని నిర్భయత్వమును కూడ స్పష్టముగా వెల్లడిచేసెను. ప్రసిద్ధులు లోకమాన్యతిలక్ గారిని, ఖిలాపత్ ఆందోళనమునకు ప్రసిద్ధనాయకులు అలీసోదరులను సర్కారువారు యీసమయములో చెరసాలలో నుంచిరి. గాంధీజీ వైస్రాయికి తీవ్రమైన నిరసన తెలియజేసెను. దేశములోని గౌరవనీయులైన నాయకులను కారాగారలోహద్వారములచాటున దాచియుంచి దేశవాసులవద్ద సహాయమును సానుభూతిని కోరుట అత్యంత అశోభనముగాను, అవివేకకార్యముగాను ఉన్నదని ఆయన తెలియజేసెను. ఈ అన్యాయమునకు ప్రతీకారము చేయుమని ఆయన వైస్రాయికి తెలియజేసెను. వైస్రాయి ఆయన ప్రతివాదమును శ్రద్ధతో ఆలకించెను. త్వరలో యీవిషయములో విచారణ సల్పి తగు యేర్పాటులు చేయబడునని ఆయనకు తెలియ జేసిరి.

గాంధీజీ ఢిల్లీనుండి గుజరాతునకు తిరిగివచ్చెను. సైన్యమును సంపాదింపవలెనన్న ముందు తనస్వస్థానములోనే ప్రయత్నముచేయుట ఉత్తమమని తలంచెను. ఆయన తన సత్యాగ్రహసంగ్రామక్షేత్రమును ఖేడాజిల్లాకు ఎడిటే చేసెను. మహాయుద్ధములో బ్రిటిషువారికి సహాయముచేయుటకు గ్రామవాసులను, రైతులను సైన్యమున చేరవలయునని వేడుకొనెను. ఈవిషయములో సాధారణప్రజలకు తెలియజేయుటకై ఆయన తనఅనుచరబృందమును, సేవకదళమును వెంటనిడుకొని ఆ జిల్లాలో అనేకసభలను జరుపుచుండిరి.

కాని గాంధీజీ ఒకప్పుడు యేప్రజల స్వేచ్ఛాప్రాప్త్యర్థమైన సహాయమును, సానుభూతిని పొందియుండెనో నేడు వారివిరోధమునకు, విద్రూపమునకు ఎదురైరి. ఆయనకు, ఆయనదళమువారికి ఎవ్వరును బండి నిచ్చుటకుకూడ నిరాకరించిరి. ఆయన గావించు సభలకు ప్రజలు హాజరగుట లేదు. ఇంగ్లీషువారికి సహాయము చేయవలెనని చెప్పినప్పుడు ఆయనను వెక్కిరించుచుండిరి. సంధిగ్ధభావముతో ఆయనను ప్రశ్నించుచుండిరి. ఇంగ్లీషువారికి సహాయముచేసి విదేశశాసనము శాశ్వతముగా నుంచవలయునా ?

గాంధీజీ యీ ఆటంకములను ఆంతరికశక్తులతో జయించుచుండిరి. బండి లేకపోయినను బహుదూరము నడచి ఒకస్థానమునుండి మరియొకస్థానమునకు పోవుచుండిరి. సభకేతెంచిన ప్రజలకు తనఆదర్శములను, ప్రణాళికను తెలియ

చేయుచుండిరి. మనము స్వాతంత్ర్యముకొరకు ఇంగ్లీషువారివద్ద నివేదించుకొనుచున్నాము. ఇంగ్లీషువారు ఇంతకుపూర్వము మనకోర్కెలను అంగీకరింపలేదు. కాని ఇప్పుడు ఆపదలో చిక్కుకొని మనసహాయమును అభిలషించుచున్నారు. మనకు కూడ ఆత్మనియంత్రణాధికారము ఉన్నదని అంగీకరించినారు. వారు క్రమక్రమముగా భారతీయులకు స్వాతంత్ర్యశాసనమార్గమున ముందుకు నడచుటకు సహాయము చేయుదురు. ఈయుద్ధాంతమున శాసనవిషయములో మహత్తరసంస్కరణములను గావింతురు. భారతీయులకు శాసనాధికారమును ప్రసాదింతురు అని తయన నుకువుచుండిరి. కావున ఇప్పుడు మనము ఇంగ్లీషువారివాగ్దానమును విశ్వసించి సత్యసంధతకు ప్రమాణము చేయవలయును. ఇంగ్లీషువారికి కలిగిన ఆపద సమయములో వారు మనయెడల గావించిన ఆచరణములను మరచిపోయి సహాయము చేయవలయును. మనము మన ఆచరణముద్వారా దేశరక్షణకు, దేశశాసనమునకు యోగ్యులమని ప్రమాణము చేయవలయును. ఈప్రమాణమునకు ప్రథమమార్గమే యుద్ధములో చేరి యుద్ధముచేయుట. యుద్ధముద్వారా భారతదేశసహృదయతను సానుభూతినిగురించి పరిచయము కలుగచేయవలయును.

గాంధీజీప్రచారము క్రమముగా సఫలీకృత మగుచుండెను. ప్రజలవిశుద్ధమనస్సులు సుముఖము లగుచుండెను. రిక్రూటింగుపని చక్కగా జరుగుచుండెను. అప్పుడు గ్రీష్మ

కాలము. దారుణమైన పంటలలోకూడ గాంధీజీ శ్రమపడు చుండెను. క్రమముగా గ్రామవాసులు గుంపులుగుంపులుగా సైన్యములో చేరుచుండిరి.

ఇంతలో భారతీయమహమ్మదీయులు ఇంగ్లీషుసర్కారు వారికి ఒకనివేదన సమర్పించుకొనిరి. యుద్ధాంతమున శత్రుశక్తికి సహాయముచేసిన టర్కీ తనసామ్రాజ్యఅంశమునుండి వంచింపబడకూడదని కోరుకొనిరి. కారణమేమనగా టర్కీ-వారిధర్మము మహమ్మదీయధర్మము, టర్కీ-సుల్తాను మహమ్మదీయప్రపంచమునకు ధర్మగురువు. వారు శత్రుపక్షము నవలంబించుటవలన దురవస్థలపా లగుదురు. సంధిననుసరించి రాజ్యభ్రష్టు డగును. ధర్మగురువు ఖలీఫా మక్కా లేక బాగ్దాద్ మొదలగు పవిత్రస్థానములనుండి వంచితుడగును. ఈ దురవస్థలను గురించి భారతీయమహమ్మదీయులు ఊహించ లేకున్నారు. అందువలన యుద్ధములో ఆంగ్లేయులకు సహాయము చేయుటకుముందు టర్కీ గౌరవరక్షణవిషయము, ఇంగ్లీషువారివద్దనుండి వాగ్దానము కోరెను.

సర్కారువారుకూడ ముసలమానుసంప్రదాయమువారికి మౌఖికవాగ్దానము నొసగిరి. 'యుద్ధానంతరము టర్కీలోని యేఅంశముకూడ విచ్ఛిన్నము గావింపబడదు. సంధి ప్రకారము ఏఅంశమునుకూడ మిత్రపక్షమువారు విభాగించి పంచుకొనరు. వారిఅఖండసామ్రాజ్యము యథాప్రకారము

గానే యుండును. ఖలీఫాయొక్క గౌరవమునకు కీర్తికి ఏవిధమైన భంగము కలుగదు.'

మహమ్మదీయులు ఆశ్వాసితులైరి. వారుకూడ యుద్ధమునకు సైన్యములో చేరుచుండిరి.

యుద్ధము ప్రాణోత్సాహముతో జరుగుచుండెను. లక్షోపలక్షలభారతీయసైనికులశక్తితో శక్తివంతులై బ్రిటిషు వారు విజయమార్గమున అగ్రేసరు లగుచుండిరి. కాని యీ సమయములో అధికశ్రమవలన గాంధీజీ ఆరోగ్యము సరిగా లేకుండెను. ఆయన రక్తభేదులచే బాధపడుచు శయ్యాగతు డయ్యెను.

గాంధీజీ తీవ్రవ్యాధిచే బాధపడుచుండెను. ఆయన సహకారులు అనుచరులు ఆయనకు సేవాశుశ్రూషలు చేయుచుండిరి. కాని గాంధీజీ యీవ్యాధినివారణకు ఎట్టిచికిత్సనుగాని, చికిత్సాపద్ధతినిగాని ఆశ్రయించలేదు. ఆయన ప్రాకృతిక చికిత్సను ఆశ్రయించెను. ప్రాకృతికచికిత్సాసహాయముతో రోగమును ప్రతిఘటించుటకును, నిగ్రహించుటకును ఎంత అధికమైన అవకాశము కలుగునో ఆయన తనవ్యాధిలో ప్రాకృతికచికిత్సను చేయించుకొని చూపించ ప్రయత్నించెను. ఈచికిత్స ఉపకారమునుగురించి ఆయన వ్రాసిన పుస్తకము నుండి ప్రాకృతికచికిత్సలోని అభినవత్వము, నూతనత్వము విషయమై చాలాసంగతులు గ్రహింపగలము.

అనారోగ్యమువలన గాంధీజీ కార్యములనుండి శెలవు గైకొనవలసివచ్చెను. ఆశ్రమములో వసించుచుండిరి. కాని సేవవిషయమై విశ్రాంతిసమయములోకూడ ఆయనమనస్సును ఆక్రమించియే యుండెను. ఆయన రైతులజీవనయాత్రప్రణాళికను చూచి, వారిఅభావములను దారిద్ర్యమును దర్శించి, కార్యములు లేనిసమయములలో వారిఅలసభావమునుచూచి విచారించుచుండిరి. వారిదుఃఖకష్టములను తొలగించుటకు ఆలోచించుచుండిరి. వ్యవసాయదారులు వ్యవసాయదినములు గడిచినపిమ్మట బహుదినములు నిరర్థకముగా గడపుచుందురు. ఆ అవసరకాలములో వారు యితరకార్యములు గావించు కొనినయెడల తద్ద్వారా కొంతధన మార్జింపవచ్చును. వారి దుఃఖదారిద్ర్యములు తొలగిపోవచ్చునని గాంధీజీ ఆలోచించు చుండిరి. గ్రామములలోని స్త్రీలకుకూడ గృహకృత్యములు ముగిసినపిమ్మట చాలావ్యవధి యుండును. ఈఅవకాశసమయ ములో వారుకూడా ఏదేని పనులు నేర్చుకొనవచ్చును. తద్ద్వారా సాంసారికఆర్థికపరిస్థితులను చక్కబరచుకొన వచ్చును. గ్రామములో ఆర్థికజీవనసమస్యల ప్రతీకారము కొరకు ఆయన ఆనారోగ్యావస్థయందును ఆలోచించుచుండిరి. పరిణామస్వరూపముగా భారతజాతీయజీవితమునకు అనుకూల మైన అభినవప్రణాళికను ఆయన కనిపెట్టి ఆప్రణాళిక కేవలము కృషీవలుల, గ్రామరమణీమణుల ఆర్థికదురవస్థలకు ప్రతీ కారము చేయుటయేగాక భారతీయులు స్వావలంబులగుట

పను స్వదేశాదర్శములను స్వీకరించుటకును మార్గము చూపించెను. ఆఫ్రికాలోని భారతీయులముక్తిని చిరస్థాయిగా సాధించినది. ఈప్రణాళిక ఖాదీప్రచారము, చరఖాపునరుజ్జీవనము.

నిజమునకు ఖాదీచరఖాలఆదర్శమే గాంధీజీజీవితములో నమూల్యమైన అధ్యాయము. ఖాదీచరఖాప్రచారము భారతదేశముక్తి ఆందోళనములో ఒకవిశేషమైన భూమిక. గాంధీజీ కార్యములలో ఖాదీప్రచారప్రయత్నము విశేషవైశిష్ట్యమును పొందినటుల పరాధీనభారతదేశములో స్వదేశవ్రతమును స్వీకరించు చరిత్రలోకూడ ఖాది అతివిశిష్టమైన విచిత్రమైన యితిహాసస్థానమును ఆక్రమించుకొనెను. గాంధీజీ ప్రత్యక్షరాజనైతిక కార్యకలాపములవిషయము కొంతఆలోచింతము.

---

## రౌలట్ బిల్లు - కృతఘ్నులైన ఆంగ్లేయులు.

ప్రథమమహాయుద్ధము విరమింపబడినటుల రోగశయ్యయందుండియే గాంధీజీ వినెను. గాంధీజీహృదయము ఆనందతరంగములలో అల్లాడిపోయెను. విజయమొందిన బ్రిటిషువారు ఈసారి భారతీయులసహాయమును గురించి స్మరించుకొందురు. కృతజ్ఞతకు చిహ్నస్వరూపముగా భారతీయులకు స్వతంత్రశాసనాధికారమును ప్రసాదింతురు. బ్రిటీషువారి

దయాపూర్వకమైన ప్రకటనకొరకు గాంధీజీ ఆతురతతో ప్రతీక్షించి యుండిరి.

బ్రిటీషువారిఘోషణ ప్రకటింపబడెను.

కాని స్వతంత్రశాసనాధికారప్రకటన కాదు-రౌలట్ విచారణకమిటీవారివిచారణఫలితమును గురించిన ప్రకటన. పరాధీనభారతవాసులను ఇంకను కఠినశాసనముల నాగ పాశముచే బంధించమని ప్రకటన?

యుద్ధానంతరము బ్రిటీషువారు శాసనవిషయములో భారతీయుల యోగ్యతను అయోగ్యతను, నిర్ణయించుటకును, దానితోపాటు బ్రిటీషుశాసకులపై భారతీయుల ఆచరణమును గురించి అనుసంధానము చేయుటకును, రౌలట్ అను ఒక ఆంగ్లేయుని సభాపతిత్వముక్రింద ఒకవిచారణకమిటీని ఏర్పాటుచేసిరి. ఈవిచారణకమిటీ రాజభక్తులును, అనుగతులును అగుభారతీయనాగరికుల ఆనుగత్యమును, సత్యసంధతను త్రోసి పుచ్చి, కేవలము హింసాకారులు, విప్లవకారులునగు భారతీయులసంఘటనలను, కార్యములను అతిరంజితముజేసి, భారతీయులు చిరకాలము బ్రిటీషువారి ఉదారపరిపాలనపై శత్రుభావాపన్నులనువిషయము నానావిధములైన ప్రమాణములతో, సాక్ష్యములతో నిరూపించెను. విచారణకమిటీ భారతీయులశత్రుత్వమును, అయోగ్యతను నిరూపించి భారతీయులను అణచియుంచుటకు అమలులో నున్ననియమములకంటె

కలితమైన, విశేషశక్తివంతమైన శాసనములను తయారు చేయుటకు బ్రిటీషువారికి హితోపదేశము గావించెను.

ఇంగ్లీషువారు భారతీయులపై సానుభూతిభావమును చూపి యిట్లు నుడివిరి. 'మీకు అధికారములను ఇచ్చుటకు మాకు ఇష్టముగనే యుండెను. కాని మీరు మాసహకారమును కోరుటలేదు. విచారకమిటీవారి ప్రకటనవలన మీకు మాతో కేవలము శత్రుత్వము చేయగోరుచున్నారనియు, మమ్ములను నాశనము చేయగోరుచున్నారనియు తెలియ వచ్చెను. అందువలన మీరింకను కొంతకాలము మాపరిపాలనక్రిందనే వసింపవలయును. మిమ్ములను యోగ్యులుగాను, తగినవారినిగాను చేయుటకు రౌలట్‌కమిటీవారి ఆజ్ఞానుసారముగా మరికొన్ని నియమములను, శాసనములను ప్రవర్తింపచేయుచున్నాము.

దుర్భాగ్యులు భారతీయులు!—— సేవకుబదులు ఎంత ఆశ్చర్యకరమైన ప్రతిదానము!

సహాయమునకుబదులు ఎంతమహత్తరమైన కృతజ్ఞత!

పిమ్మట కృతఘ్నులైన బ్రిటీషువారు భారతీయుల మంగళముకొరకు 'రౌలట్ ఆక్టు' అనుపేరుతో నూతనశాసనమును పార్లమెంటుద్వారా ఆమోదింపచేసిరి. శాసనానుసారముగా ఏభారతీయునైనను ఇష్టానుసారముగాగాని లేక సందేహము కలిగినగాని అరెస్టు చేయుటకును, నిర్ణయములేని

కాలమునకు జైలులో నుంచుటకును, విచారణ లేకుండా శిక్షించుటకును గలఅధికారమును ప్రకటన చేసిరి!

భారతీయులు చమకితులైరి!

రాజభక్తులును, రాజుగారిపై విశ్వాసపరాయణులు నైన భారతీయులుకూడ నేత్రములను విస్ఫారితము గావించు కొనిరి!

భారత దేశ మంతటను దీర్ఘ విశ్వాసముల ప్రబలతరం గములు ప్రవహించుచుండెను.

ఆశాన్వితులైయున్న గాంధీజీ స్తబ్ధులైరి. ఆయన హృదయము వేదనాభారముచే కృంగిపోయెను. ఇదియా యుద్ధములో సహాయపడినందుకు ఫలితము!

ఇది విశ్వాసమునకుబదులు చరమవిశ్వాసఘాతుకత అని ఆశాహతహృదయము జవాబిచ్చెను.

గాంధీజీవివేకము ఆయన కిట్లు తెలియజేసెను—

'నేను బ్రిటీషువారి విశ్వసనీయమైన నాగరికునిగా వారికి హృదయపూర్వకమైన సహాయము, సేవ గావించితిని. ఆపద దినముల నతిక్రమించి బ్రిటీషువారు ఇంతశీఘ్రముగా దానిని మరచిపోయినప్పుడు నేను ఇక యీఅసత్య అనుగత్యవిశ్వాస మును అంటిపట్టి యుండజాలను!

బ్రిటీషువారిప్రవర్తనవలన విశ్వాసియు, ఉదారుడు నైన గాంధిజీ కఠినఅనుభవములద్వారా తీవ్రరూపము

హొల్చెను. నూతనభావములతో కార్యరంగమున ప్రవేశింప ప్రతిజ్ఞాబద్ధు డయ్యెను.

రౌలట్ బిల్లును విమర్శించి ఆయన వైస్‌రాయి చెమ్స్ ఫోర్డుకు ఉత్తరము వ్రాసెను. వార్తాపత్రికలసహాయముతో భారతదేశమంతటను ఈశాసనముయొక్క దుష్టభావములను వ్యక్తపరచుచు ప్రజలను మిథ్యా అన్యాయములకు విరుద్ధముగా జాగరూకులను గావించెను. వార్తాపత్రికలద్వారా యీశాసనమును రద్దుచేయుమని బ్రిటీషువారిని ప్రార్థించు కొనెను.

గాంధీజీ, దేశబంధు చిత్తరంజన్‌దాస్, లోకమాన్య బాలగంగాధరతిలక్, పండిత మతిలాల్ నెహ్రూ మొదలగు ప్రసిద్ధనాయకులు ఈదమననీతిపూర్ణమైన శాసనమును రద్దు చేయుమని అనేకవిధముల ప్రయత్నము చేసిరి. వైస్రాయి శాసనపరిషత్తుసభ్యులుకూడ యీశాసమునకు విరుద్ధముగా అభిప్రాయములను ప్రకటించిరి. వ్యవస్థాపకసభలో నున్న విశిష్ట భారతీయసభ్యులుకూడ సభ జరుగుచున్నసమయములో ఈశాసనమును రద్దుచేయుమని అధికారులను వేడుకొనిరి.

కాని అంతయు వ్యర్థమాయెను!

శాసనము రద్దుకాలేదు సరికదా, శాసనపాషాణ భారముచే అనేకనిరపరాధులగు భారతీయులు నలిగిపోవు చుండిరి.

దేశమంతటను దాగియున్న అగ్ని ప్రజ్వరిల్లుచుండెను.

దేశములోని నాయకులు ఈవిషయములో ఒకస్థానకు వచ్చుటకు జాతీయమహాసభకొరకు విశేషమహాసభ ముకు ఆహ్వానించిరి.

---

అహింస భారతదేశము - హింసాపరాయణ బ్రిటిషువారు.

1919 వ సంవత్సరములో భారతజాతీయమహాసభా సమావేశము జరిగెను. ఇంతలో దేశములోని నాయకబృందము గాంధీజీని మహాసభలో సభ్యుడుగా చేరుమని కోరియుండిరి. తన ఆదర్శములను సార్థకపరచుకొనుటకును, మహాసభను కార్యాన్వితము గావించుటకును, గాంధీజీ కాంగ్రెసులో సభ్యుడుగా చేరెను. గాంధీజీ మహాసభలో మితవాదుల కర్తృత్వమును దర్శించెను. మరల 1918-19 వ సంవత్సరములలో మితవాదులకు సెలవిచ్చి పంపుటవలన క్రియాశీలుర, విప్లవకారుల ఆగమనముకూడ గాంచెను. జాతీయమహాసభ ఆవేదన నివేదనములను చేయుట, కేవలము భోజనపుపళ్లెలపై కూర్చుని ఉపన్యాసములిచ్చుటను త్యజించి, దేశముకొరకు సంగ్రామము చేయుటకును, యుద్ధక్షేత్రమున కార్యములాచరించుటకును తయారగుచున్నదని గాంధీజీ గ్రహించెను. నిష్క్రియత్వమునుండి దేశబంధు, మోతీలాల్ నెహ్రూ మొద

ంగ క్రియాశీలుర ఉద్యమములు, ప్రయత్నముల పరిచయమును పొందెను. మహాసభ తన ఆదర్శములకు ఆశ్రయము కాబోవుచున్నదని గ్రహించెను. మహాసభ ఆదర్శములు గాంధీజీ ఆదర్శములకు సన్నికటమైనవి. నివేదన అనునయముల కార్యములు వ్యర్థమైనప్పుడు సంగ్రామము ప్రతిఘటన బాధ్యత వహింప సంసిద్ధమయ్యెను. గాంధీజీ యీసారి మహాసభలో ప్రవేశించెను.

మహాసభా సమావేశములో గాంధీజీ సలహాలును, ప్రతిపాదనములును ఏకగ్రీవముగా ఆమోదింపబడెను. సేవాసహాయమునకు బదులు భారతదేశము, భారతీయులు ఇంత నీచమైన, అసహ్యమైన విశ్వాసఘాతుకతను ఎంతమాత్రము సహించబోరు. ఇది స్థిరము చేయబడెను. భారతీయులు ఈ నీచమైన రౌలట్ బిల్లును ప్రతిఘటింపవలయును. మహాసభ యిట్లు నిర్ణయించెను. ఈప్రతిఘటనకు సమయము నిర్ణయించు పని మహాసభ గాంధిజీపై భారము వేసెను.

రాజకోట భీరువు, లజ్జాశీలుడునైన మోహనదాసువిషయము స్మరణకు వచ్చుచున్నవి. బాల్యకాలపు భీరుత్వము, లజ్జ ఒకప్పు డెవనిని విద్యాలయములోని సమవయస్కులవద్ద కూడ మూగవానినిగ, అల్పునిగ జేసి యుంచెనో, ప్రథమ యౌవనసంకోచము ఒకప్పు డెవనిని క్షుద్రసభాసదులసమక్షమున మాట్లాడుటకుకూడ అసమర్థునిగ గావించెనో, లిఖిత విషయమును ఉపన్యసించుటకుకూడ దౌర్బల్య మొనసిచే చేయ

ంలు గాల్చించెనో, ఆమోహనదాసు మహాత్మాగాంధిరూ పమున, సత్యజ్యోతులధారారూపమున, అహింసా అసహకారాస్త్ర శస్త్రముల అవిచ్ఛిన్నరూపమున సకలభయలజ్జాసంకోచములను క్షణములో జయింపగలిగెను. భయలజ్జాసంకోచములను సమావేశపరచి వానిపై ఏకైకతను, నిష్కాపట్యమును, వికసవిభాసిత తేజోమయస్వరూపమునొక్క దృఢతరపునాది స్థాపించెను. ఆ పునాదిపై తన శ్రేష్ఠత్వమునొక్క, మహత్త్వ మునొక్క విశాలభవనమును నిర్మించెను. ఆమందిరము యొక్క మహత్తరమగు మహోన్నతముగా ప్రాకారాకాశమున విశ్వరూపమును దాల్చెను.

భారత దేశమహాసభలో మహానేతయొక్క, అధినాయ కునియొక్క స్థానము ఆయనకు లభించెను.

గాంధీజీ కర్మజీవితములో నూతన అధ్యాయము ఆరంభ మాయెను. నది పర్వతమునుండి ప్రవహించ నారంభించెను.

ఆటంకములవలన, ప్రస్తరాఘాతములవలన క్షీణ ముగా సంకుచితముగా నడుచుండెను.

క్షీణరూపము దాల్చిన ప్రవాహము సమతలక్షేత్రము నకు దిగివచ్చెను.

క్షీణదేహమును సమతలభూమిపై ప్రసరింపజేసెను.

నది బాధావిముక్త మయ్యెను. మహత్తరరూపమును దాల్చెను. విశాలరూపమున పరిణమించెను.

తీవ్రస్రోతస్సుగల నది విరామరహితముగ తీవ్రవేగమున సముద్రసంగమోన్ముఖమైను. ప్రపంచము తనవక్షమునందు నదియొక్క మాహాత్మ్యమును స్వీకరించెను.

సత్యద్రష్టయగు గాంధీజీ జీవితముయొక్క క్రమవికాస ధారను నదీప్రవాహముతో పరిపోల్చి చూచినయెడల రెంటి యందును విచిత్రసమన్వయమును చూడగలుగుదుము.

గాంధీజీ ప్రచారమును ఆరంభించెను. భారతదేశ వాసులు ఈరౌలట్‌బిల్లును విరుద్ధముగా ప్రతిఘటింతురు. సర్కారువారు ఈప్రతిఘటనను లక్ష్యపెట్టనియెడల యీశాసనమునకు విరుద్ధముగా సత్యాగ్రహము చేయవలయును. ఆయన యిట్లు తెలియజేసిరి— "ఈశాసనమునకు జవాబుగా మనము సమస్తదేశమునందును హరతాళము జరుప సంకల్పించవలయును. సత్యాగ్రహము ఆత్మశుద్ధియుద్ధము. ఇది ధర్మయుద్ధము. ధర్మకార్యమును శుద్ధిద్వారానే ఆరంభించవలయును. ఆరోజున అందరును ఉపవాసముండవలయును. తమతమ కార్యములను విరమింపవలయును." ఈఉపవాసము 24 గంటలవరకు పాలింపవలయునని అందరికిని తెలియచేయబడెను.

ప్రతివాదస్వరూపముగా 1919 ఏప్రిల్ 6 వ తేదీన సాధారణహరతాళము జరుపుటకు గాంధీజీ ప్రకటనద్వారా తెలియజేసిరి. భారతీయులందరును ఆనాడు ఉపవాసముచేసి

హృదయములో దృఢమైన యిచ్ఛను, శక్తిని పొందవలె నని అందరికి ఆజ్ఞాపించబడెను.

అందరు బయటిపనిపాటలు, ఆఫీసులు, కోర్టులు, మిల్లులు మొదలగుపనులకు పోవ నిరాకరించవలయునని ప్రకటించబడెను. ఆ నెలలో ముసలమానుల రోజా జరుగుచుండెను. అందువలన ముసల్మానులు ప్రత్యేకముగా ఉపవాసము చేయక ఆ రోజాతోనే ఉపవాసము పాలింప కోరబడిరి.

అల్పకాలములోనే యీ హరతాళవార్త సమస్తభారత దేశమునందును వ్యాపించెను. ధనికులు, దరిద్రులు, హిందువులు, ముసల్మానులు, జైనులు, పార్శీలు, బౌద్ధులు, క్రైస్తవులు మొదలగుభారతీయు లందరిలోను ఉత్సాహోద్రేకములు చెలరేగెను. దుష్టశాసనమును ప్రతిఘటించుటకు అమోఘమైన ఉపాయమును నిరీక్షిత, తిరస్కృతభారతీయులు వెదకి కనుగొనిరి. గాంధీజీ యీసమయములో హరతాళమును జయప్రదముగా గావించుటకు బొంబాయికి వెడలిపోయిరి. మద్రాసుకార్యభారము శ్రీరాజగోపాలాచారి, సర్దార్ పటేల్ శ్రీమతి కస్తూరిఅయ్యంగార్లు మొదలగువారిపై వేసిరి. ఈ రౌలట్ శాసనమునకు విరుద్ధముగ ప్రచారము చేయునప్పుడే శ్రీ చక్రవర్తుల రాజగోపాలాచారిగారితో పరిచయము కలిగెను. శ్రీరాజగోపాలాచారిగారు గాంధీజీకి సహకారిగా యీసమయములో దేశసేవాకార్యములలో ప్రవేశించెను.

భారతదేశములో సర్వత్ర విశేషసాఫల్యముతో హరతాళము పాలింపబడెను. కొన్నికొన్నిస్థలములలో భారతవాసులు ఊరేగింపుగా బయలుదేరి రౌలట్ శాసనముకు విరుద్ధముగా అసమ్మతిని తెలియ చేయుచు వీధులలో ప్రచారము చేసిరి. బొంబాయిపట్టణములో గాంధీజీ, శ్రీమతి సరోజినీనాయుడు, ఇతర ప్రసిద్ధహిందుమహమ్మదీయనాయకులు ఏకమై ఒక బ్రహ్మాండమైన ఊరేగింపుతో బయలు దేరిరి. ఊరేగింపు ఒకమసీదువద్దకు వచ్చినప్పుడు, మసీదుఅధికారుల ముసల్మాన్‌వాల్ల కోరిక ప్రకారము గాంధీజీ మసీదు అరుగుపై నిలువబడి హిందుముస్లిమ్‌జనప్రవాహమును హెచ్చరించి యీ శాసనమునకు విరుద్ధముగా సంగ్రామము చేయుటకు ఏకమత్యముతో సంసిద్ధము కావలయునని ప్రబోధించెను. జనసమూహము ఆయన ఉపదేశానుసారముగా సంగ్రామక్షేత్రములో ప్రవేశించుటకు సంసిద్ధమై యున్నామని తెలియజేసెను.

హరతాళము శాంతిపూర్వకముగా జరిగినను ఇంగ్లీషువారు అశాంతి సృష్టిచేయుటకు ప్రయత్నించిరి. కొన్నికొన్ని ప్రదేశములలో అస్త్రధారులైన పోలీసులు, సైన్యసమూహములు ఊరేగింపును ఆటంకపరచుటకు ప్రయత్నించిరి. ఊరేగింపులో పాల్గొన్నవారిని కొందరిని కొట్టిరి. అనేకమందిని కారణము లేకపోయినను అరెస్టుచేసిరి. ఆకారణముచేత జనప్రవాహముకూడ కొంతవరకు హద్దు మీరవలసివచ్చెను.

అహమదాబాదుపట్టణములో ప్రజలకు పోలీసులకు సంఘర్షణము జరిగెను. ఢిల్లీ, పంజాబులోని అమృతసరపట్టణములలో కల్లసులు చెలరేగెను. కలకత్తాలోకూడ కొన్నికొన్ని స్థానములలో పోలీసులు అశాంతిని సృష్టించిరి.

అశాంతి, హింసల విషయము అహింసాప్రాజారి గాంధీజీ విని అత్యంతవిచలితు డయ్యెను. ఢిల్లీ పంజాబుల లోనిసంఘటనలు విశేషఅల్లరులకు కారణము కావచ్చునని తలంచి గాంధీజీ వెంటనే ఢిల్లీ, పంజాబుప్రదేశములకు పోవుటకు సిద్ధపడెను. గాంధీజీ కొందర సహకారులను వెంటనిడుకొని ఢిల్లీపోవురైలులో ఎక్కెను. కాని ఆయన ఢిల్లీప్రయాణము సాగలేదు. ఏప్రిల్ 8 వ తేదీన బండి మధురానగరమునకు చేరెను. ఆసమయములో పోలీసువారు వచ్చి ఆయన బండిలో ప్రవేశించి సర్కారువారి ఆజ్ఞాపత్రమును ఆయనకు అందించిరి— 'మీరు ఢిల్లీలోగాని, పంజాబులోగాని ప్రవేశించినచో అచ్చట అశాంతి అధికము కావచ్చును. కావున మిమ్ములను ఆసరిహద్దులకు పోనియ్యము' అని అందులో వ్రాయబడియుండెను. గాంధీజీ తనసహజధోరణిలో నవ్వుకొనెను. నవ్వులో హృదయమునందున్న దృఢత్వమును ఏకముజేసి సహజకంఠముతో నుడివినదేమనగా— 'నేను అశాంతిని పెంచుటకు పోవుటలేదు. అశాంతిని తగ్గించుటకు పోవుచున్నాను. సర్కారువారి ఆజ్ఞనుఅంగీకరింపజాలనందుకు విచారించుచున్నాను.'

ఆజ్ఞను నిరాకరించి దృఢచిత్తముగల గాంధీజీ యాత్ర ప్రారంభించెను. పలవాలస్టేషనులో పోలీసులు ఆయనను అరెస్టుచేసిరి. అరెస్టుచేసి వేరొక పెట్టెలోనికి తీసుకొనిపోయిరి.

కాని గాంధీగారిఅరెస్టువార్త సమస్తభారతదేశము నందు విద్యుద్వేగముతో వ్యాపించెను. భారతదేశవాసులు ఈవార్త విని అత్యంతఅధీరులైరి. క్రోధావేశులైరి. వివిధ ప్రదేశములలో ప్రజలకు పోలీసులకు పోరాటములు జరిగెను.

సర్కారువారు ఈపరిస్థితులను చూచి చింతాన్వితులైరి. తుదకు బొంబాయిదగ్గర ఒకస్టేషనుకు తీసుకునివచ్చి గాంధీజీని వదలివేసిరి. గాంధీజీ అచ్చటినుండి బొంబాయిపట్టణమునకు వచ్చెను. హిందుముస్లిము అను భేదములేక పట్టణవాసులందరును మహదానందముతో ఆయనకు స్వాగత మిచ్చిరి. ఆయనతో ఒకబ్రహ్మాండమైన ఊరేగింపు బయలుదేరెను. సర్కారువారికి మరల దుర్బుద్ధి కలిగెను. వారు ఊరేగింపును చెదరగొట్టుటకు పోలీసుసైన్యమును పంపించిరి. పోలీసులువచ్చి ఊరేగింపును ఆటంకపరచిరి. కాని ప్రజలు పోలీసుఆజ్ఞానుసారముగా ఊరేగింపును విరమించుటకు ఇష్టపడలేదు. పోలీసులకు పంతము రెచ్చిపోయెను. అశ్వారోహులగు పోలీసు సైన్యము ప్రజలను నలగదొక్కి జనసమూహములో ప్రవేశించెను. అనేకమంది ఆహతులైరి. అనేకులు మరణావస్థలో పడిపోయిరి. హింసాసహాయముతో అత్యాచారులగు అధికారులు అహింస శాంతరూపముగదాల్చిన జనసమూహమును

చెదరగొట్టిరి. అధికారుల యీఅన్యాయప్రవర్తనవలన గాంధీగారిమనస్సు కలత చెందెను. ప్రజలకు సంభవించిన మరణముల వలన ఆయన హృదయము ఆవేదనతో పరిపూర్ణమై పోయెను. ఆయన ప్రశాంత ధైర్యముల నవలంబించి బొంబాయిపోలీసు కమీషనర్ వద్దకు వెళ్ళెను. ఈనిర్దయమైన పశుతుల్యమైన ప్రవర్తనను తీవ్రముగా ఖండించెను.

గాంధీగారి శాంతిపూర్ణమైన అహింసాత్మకశాసనోల్లంఘనమును సాధారణప్రజలు అంగీకరింపని కమీషనరు గాంధీజీకి జవాబొసగెను. వారు యీఅవకాశమును కనిపెట్టి సర్కారువారిఉద్యోగస్తులను ఆక్రమించిరి. సర్కారువారి వస్తువులను నష్టపరచిరి. అందువల సర్కారువారు దమననీతిని అవలంబించవలసివచ్చినదని నుడివెను.

ఊరేగింపులో సర్కారువారిని ఎవరును ఆక్రమించలేదనియు, కమీషనరు పొరపడుచున్నారనియు గాంధీజీ తెలియజేసెను.

కమీషనరు గాంధిగారి వాదమును అంగీకరింపలేదు. గాంధీజీ దేశమును రెచ్చగొట్టగలరుగాని ప్రజలను శాంతిపరచజాలరని వ్యంగ్యోక్తితో పలికెను. అందువలన ప్రయోజనానుసారముగా సర్కారువారు సర్వత్ర ప్రజలకు శిక్షనొసగుటకు ఏర్పాట్లు గావించియున్నారు.

గాంధీజీ విచారగ్రస్తుడై కమీషనర్ ఆఫీసునుండి తిరిగి వచ్చెను. ప్రజలను అణచియుంచుటకై నాలుగువైపుల

సర్కారువారిదమననీతి అగ్నివలె ప్రజ్వరిల్లెను. ప్రజలు కొట్టబడిరి. అరెస్టు చేయబడిరి. జైళ్ళకు పంపబడిరి.

సహనమునకుకూడా నొకహద్దు గలదు. సాధారణ ప్రజలసహనశక్తి ఆహద్దునకు వచ్చి చేరెను. సర్కారువారి దండనీతికి విరుద్ధముగా సాధారణప్రజలు కలవరపడుచుండిరి. కార్మికులు బొంబాయి, అహమదాబాదు మొదలగుపట్టణములలోని రైల్వేలైను ఊడదీసి పారవైచిరి. టెలిగ్రాఫుతీగలను త్రెంచివైచిరి. అచ్చటచ్చట సర్కారువారిఆఫీసులు ఆక్రమింపబడెను.

సాధారణప్రజలు సాగించుచున్న యీహింసాకాండ వార్తలను విని గాంధీజీ విచారగ్రస్తుడయ్యెను. అత్యంత దుశ్చింతలలో మునిగిపోయెను. శాంతనిరుపద్రవప్రతివిధాన కౌశలమును ప్రజలు ఇంకను గ్రహింపలేదు. హఠాత్తుగా ప్రజలను ఈకార్యప్రణాళికలోకి ఈడ్చుకొనివచ్చుట పొరపాటని గాంధీజీ గ్రహించెను.

తనపొరపాటును గాంధీజీ గ్రహించి దేశవాసులను శాంతింపమని ఉపదేశించెను.

గాంధీజీ యీఆత్మదోషస్వీకారమువలన, ఆందోళనమును ఆపివేయుటకు చేసిన సంకల్పమువలన ఆయనసహకారులు కొందరు నిరుత్సాహమొందిరి. గాంధీజీకి వారు ఫిర్యాదు చేసుకొనిరి.

దేశవాసులకు ముందు సత్యాగ్రహమును అహింసా తత్త్వమును నేర్పవలయునని గాంధీజీ వారికి తెలియజేసెను. సత్యాహింసలనీతిని గ్రహింపగలిగిన యెడల దేశము హింసకులు హింసను ప్రయోగింపవిరమించును. హింసోపజీవులు శాంతిసహనములతో అహింసావిధానమునే అవలంబించును. ఈవిధానము ధర్మయుక్తమై అపారశక్తిశాలియై వర్థిల్లును. అప్పుడు ప్రపంచములోని ఏహింసాశక్తియు ఈశక్తిని ఆటంకపరుపజాలదు. అహింసఅసహాయోద్యమమువద్ద పశుశక్తులన్నియు పరాజయమును స్వీకరించును.

గాంధీజీ వారికి తెలియజేసిన దేమనగా దేశవాసులకు అహింసా సత్యాగ్రహములవిషయము నేర్పుటకు తగు ఏర్పాటు చేయవలయును.

శాసననిరసనఆందోళనము ఆరంభించుటకు ముందు ఆయన సత్యాగ్రహసభను స్థాపించెను. వివిధస్థానములలో దేశవాసులను సత్యాగ్రహములో దీక్షితులను గావించుటకు సత్యాగ్రహాశిబిరములను స్థాపించెను. స్థానాంతరముల ఆవిషయములు ఆలోచించబడును.

---

## జాలియన్‌వాలాబాగ్.

గాంధీజీ తన కార్యక్రమమునుగురించి సందేహించుచుండిరి.

కాని శాసకశక్తి గాంధీజీకర్తవ్యములకొరకు అపేక్షించక తనకర్తవ్యములను నెరవేర్చుకొనుచుండెను. ప్రతివిధానము నవలంబించుచున్న భారతీయులను అన్యాయశాసనములద్వారా అణచివేయ ప్రయత్నించుచుండెను.

ఈ ప్రయత్నమునకు దృష్టాంతము జానియన్ వాలాబాగు.

రౌలట్ శాసనమునకు విరుద్ధముగా జరిగిన హరతాళమును ఆధారముగా చేసికొని యితరప్రదేశములలోవలె పంజాబులోకూడ అందు అమృతసరములో విశేషమైన ఆందోళనము బయలుదేరెను. ఆపట్టణములోని హిందూముసల్మాన్ మొదలగుధర్మసంబద్ధమైనప్రజలును, వృద్ధులు, యువకులు నారీమణులు మొదలగుసకలమానవులును, ధనికులు దరిద్రులు అను సకలశ్రేణులవారును హరతాళమును పాలించి అసమ్మతిని తెలియజేసిరి. పంజాబు యింగ్లీషువారికి సైన్యము సమకూర్చు దేశము. పంజాబీహిందువులు, మహమ్మదీయులు, సిక్కులు ఇంగ్లీషుసర్కారువారి సైన్యదళమును బలమైనదానినిగా చేయుచుండిరి. ప్రథమమహాయుద్ధములో అనేక కష్టములను పొంది ఇంగ్లీషువారిగౌరవమును, ప్రాణములను పంజాబుసైనికులే రక్షించియుండిరి. ఆపంజాబివారి హృదయములలోకూడ స్వాతంత్రపరిపాలనేచ్ఛ జాగరితమైనది. అత్మనియ స్వాతంత్ర్య అభిలాష కలిగినది. సైనికసహాయమునకుబదులు ఇంగ్లీషుసర్కారువారు ప్రతిదాన మిచ్చెదరనియు, స్వదేశ

మును పరిపాలించుకొను అధికారమిచ్చెదరనియు వారుకూడ యితరసహోదరకారులవలె అనురక్తభారతవాసులవలె విశ్వసించిరి.

సర్దారువారు ఈసేవకు ప్రతిఫలముగా రౌలటు కట్టను ప్రసాదించిరి!

కృతజ్ఞతకు ప్రతిఫలము— అత్యంతదుఃఖపూర్ణమైన నిష్ఠురమైన ప్రతిఫలము!

ఇంగ్లీషువారి అనుగతులైన శిఖ్ఖులు, ముసల్మానులు, హిందుపంజాబీలు సర్దారువారి రౌలటుఆక్టు ప్రకటనమును వినినప్పుడు ఆశ్చర్యపడినదానికంటె అధికముగా కోపోద్రిక్తలైరి. పిమ్మట వారు ఈకృతఘ్నతకు విరుద్ధముగా శిరములెత్తి హరతాళమును ఆరంభించిరి. సమరపిపాసులగు పంజాబీలు అహింసామంత్రపూజారినుండి మంత్రమును స్వీకరించిరి. సంఘబద్ధమై సమ్మిళితమైన యీశాసనమునకు విరుద్ధముగా తమచిత్తక్షోభమును తెలియజేసిరి.

కాని కొలదిదినములలో మహత్తరమైన ప్రజాసమూహములో సంపూర్ణమైన అహింస ప్రతిష్ఠితము కాజాలదు.

అందువలన అమృతసరులో అచ్చటచ్చట అల్లరులు బయలుదేరెను. అత్యాచారులగు పోలీసులదమననీతివల్లనే యీఅల్లరులు బయలుదేరెను.

తుదకు పంజాబుసర్దారువారు అమానుషికమైన కార్యములను గావించిరి. సభలనుగాని ఊరేగింపులనుగాని

జనసమావేశములను నిషేధించుచు ప్రజలకు సామరిక శాసనమును ప్రకటితము చేసిరి. కొద్దిమందిమాత్రమే యీసామరిక శాసనమునుగూర్చి తెలుసుకొనగలిగిరి. అధికసంఖ్యాకులకు యీ వార్తయే తెలియదు.

ఏప్రిల్ 13 వ తేదీన అమృతసరులోని 'జాలియన్ వాలాబాగు' గోడలనంటియున్న మైదానములో సామరిక శాసనము, సర్కారువారి దమననీతికి విరుద్ధముగా తమ ప్రతివాదమును తెలియజేయుటకై నాయకులు ఒకసభను ఏర్పాటు చేసిరి. ఆ తేదీన గుంపులుగుంపులుగా ప్రజలు వచ్చి ఆసభాస్థలములో సమావేశమైరి. హిందూమహమ్మదీయులను భేదము లేక అందరును ఆస్థానములో సమావేశమైరి. హఠాత్తుగా అస్త్రధారులగు సైనికులు డయ్యూర్ అను మిలటరీఉద్యోగి నేతృత్వమున జాలియన్‌వాలాబాగ్ మైదానమును నాలుగువైపుల ఆక్రమించిరి. ఆమైదానములో ప్రవేశించుటకు రెండుమార్గములే యుండెను. డయ్యూరుఆదేశానుసారముగా సైనికులు నిరాయుధులగు అమాయికప్రజలపై ప్రబలవేగముతో తుపాకులు కాల్చుట కారంభించిరి. ప్రశాంతముగానున్న ప్రజలు హఠాత్తుగా ఆక్రమింపబడిరి. ప్రజలు దిక్కులేనివారైరి. అందరును బయటికి వచ్చుటకును, పారిపోవుటకును, అటుయిటు నెట్టుకొనుచుండిరి. బయటికివచ్చుమార్గములో గుళ్ళవర్షము కురియుచుండెను. వృద్ధులు, యువకులు, శిశువులు రుధిరాక్త కళేబరములతో భూమిపై ఒరిగిరి. తప్పించుకుని పారిపోవుటలో

నలిపబడి త్రొక్కబడి ఎందరో దుర్బలులు, వృద్ధులు, శిశువులు తమఅంత్యనిశ్వాసమును విడిచిరి. ఆమైదానములో శవములపర్వతములు తయారుచేయబడెను. మహాహామర్మబాధలచేతను, ఆర్తనాదములతోడను, ముమూర్షువులమూలుగులతోను, ఆహతులఏడ్పులతోను ఆకాశపాతాళములు ముఖరితము లగుచుండెను. వేలకొలదిమానవుల రక్తప్రవాహములచే మైదానమంతయు ఆవరించిపోయెను. కఠినమైన మృత్తిక కోమలరూపమును దాల్చెను. సైనికులగుళ్ళు నిశ్శేషమై పోయెను. గుళ్ళు ఆఖరైపోవుటచే పాపపుడయ్యరు చాలా విచారగ్రస్తుడయ్యెను. భారతీయులను సంపూర్ణముగా అవమానపరచకపోవుటచేత నిరాశాహృదయముతో డయ్యరు తనసహచరులు మైదానమును వదలిపోయిరి.

ఈదుఃఖవార్త సాయంకాలమునకు పట్టణములో వ్యాపించెను. దుర్భాగ్యులగు పట్టణవాసులు ఆత్మీయస్వజనుల విషయములను తలంచుకొని మైదానమువైపునకు పరుగిడి పోయిరి. రాత్రి తనఅంధకారరూపమగు నల్లనివస్త్రమును పరిచి యీబీభత్సమైన హృదయవిదారకమైన దృశ్యమును దాచిపెట్టెను. కాని దుఃఖసముద్రమున మునిగిన ప్రజలు అంధకారమునకు భయపడుదురా? భార్య మృతభర్తకళేబరమును వెదకుచుండెను. కొమారుడు తండ్రిదేహముకొరకు అన్వేషించుచుండెను. వృద్ధుడగుతండ్రి యువకుడగు పుత్రునిదేహము కొరకు ఇటునటు పరుగిడుచుండెను.

అనుభరాత్రి అవసానమొందెను. కాని అమృతసరము లోని హిందూమహమ్మదీయులదురవస్థలు అవసాన మొంద లేదు. నూతనదురవస్థలు, దుఃఖములు వారిపై పర్వతముల వలె పడుచుండెను. అధికారులు గృహస్థులగృహములలో ప్రవేశించి వారిపై అత్యాచారములు చేయ మొదలిడిరి. వీథు లలో ప్రజలు పోవుచున్నపుడు మోకాళ్ళతో దోగాడుచు నడువుమని ఆదేశించిరి. యూనియన్ జాక్ కు వందనములు చెల్లించవలని బలవంత పెట్టుచుండిరి. మానవులపై పశువులవలె ప్రవర్తించుచుండిరి. పంజాబుసర్కారువారి అమానుషిక అత్యాచారములు హద్దులను అతిక్రమించిపోయెను.

ఈదురవస్థల, అత్యాచారములవార్తలను ప్రథమమున పంజాబుసర్కారువారు దాచియుంచిరి. కాని సర్కారువారి జాగరూకతను అతిక్రమించి అల్పకాలములోనే సమగ్రభారత దేశమునందు వ్యాపించెను. ఈవిషయము విని సమస్తభారత దేశఆత్మ కంపించెను. సమస్తభారతదేశము శోకానలముచే, ఆవేదనచేతల్లడిల్లిపోవుచుండెను. ఆంగ్లేయులమనుష్యత్వమును గురించి సాధారణప్రజలకుకూడా సందేహము కలిగెను. వార్తలను విని, వార్తలభయంకరత్వమును ఆలోచించి ఆంగ్లే యులమనుష్యత్వములో విశ్వాసముంచిన గాంధీజీకూడ తుదకు ఆంగ్లేయులస్వభావమునుగురించి సందేహించెను. పంజాబు లోని అసహాయ హతభాగ్యప్రజను చూచి యీ ఆపదసమ

యములో ఓదార్పును కలిగించవలెనని ఆయనహృదయము తల్లడిల్లి పోవుచుండెను.

గాంధీజీ వైస్రాయిచెమ్స్‌ఫోర్డుకు ఉత్తరమును వ్రాసెను. ఆయన పంజాబు వెళ్ళుటకు అనుమతించమని వేడుకొనెను. కాని గవర్నర్ జనరల్ అనుమతి నిరాకరించెను.

హృదయములో పొంగిపొరలుచున్న దుస్సహశోకము చేత వైస్రాయిఆదేశమును ధిక్కరించెదనని గాంధీజీ తలంచెను. కాని విశేషముగ ఆలోచించి స్థిరపరచుకొనిన దేమనగా—ఈ ఉత్తేజనాసమయములో శాసనమును ధిక్కరించినచో అత్యంతవిపరీతమైన, భయంకరమైన ఫలితము ఫలింపవచ్చును. ఆదేశమును ధిక్కరించినందుకు ముందు తనను అరెస్టు చేయుదురు. ఆయన అరెస్టువార్త యీశోకార్త ఉత్తప్తవాతావరణములో అగ్నిలో ఆజ్యము పోసినట్లగును. దేశవాసు లందరు కోపగింతురు. హింసాపూరితు లగుదురు. శాసనకర్తలపై తిరుగుబాటు చేయవచ్చును. దేశవాసుల యీకార్యముల అవకాశము తీసుకుని అత్యాచారులగు సర్కారువారు యింకా అత్యాచారములు సలుపవచ్చును. దేశమంతటను దమననీతిని, ధ్వంసాత్మకకార్యములను జరుపవచ్చును. దేశము దురవస్థల దుఃఖకష్టములపంకములో నిమజ్జితము కావచ్చును. గాంధీజీ యీవిషయములన్నిటిని వివేచనచేసి పంజాబుప్రయాణము విరమించెను. కాని ‘యంగ్ యిండియా’ ‘నవజీవనము’ మొదలగు పత్రికలద్వారా పంజాబుసర్కారు

వారి యీచండనీతికి విరుద్ధముగా తీవ్రమైన, కఠోరమైన విమర్శనములను చేయుచుండెను. ఈసమయములో ప్రసిద్ధ ఆంగ్లపత్రిక 'బాంబేక్రానికల్' కూడ యీ అమానుషిక అత్యాచారములను గురించి విశేషముగా ప్రచారము చేయుచుండెను. ఇది సత్యమును ప్రచారము చేయుటచేత విరక్తి చెంది బొంబాయిసర్కారువారు దీనిసంపాదకుడైన హార్నిమాన్ను అరెస్టుచేసిరి. అప్పుడు దీనిపరిచారకులు గాంధీని ప్రార్థించుటచే దీనిభారమును ఆయనయే స్వీకరించెను. దీని సహాయముతో కూడ దేశమంతటను తీవ్రమైన ప్రచారకార్యము సాగించుచుండిరి. ఇదిగాక ఢిల్లీ, అలహాబాదు, కలకత్తా మొదలగు నగరములలోని దేశీయమైన, జాతీయమైన పత్రికలుకూడ యీనీచకాండకు విరుద్ధముగా నిర్భయమైన, సత్యమైన విమర్శనములను వ్రాసి దేశవాసులను జాగరూకులనుగాను, ప్రబోధితులనుగాను గావించెను. భారతదేశములోని ప్రతివార్తాపత్రికయు గాంధీజీపంజాబుప్రయాణమునుగురించి గావింపబడిన నషేధాజ్ఞను విని ఆశ్చర్య మొందెను. గాంధీజీ సత్వరమే పంజాబుపోవుటకు అనుమతినియ్యమని కోరుచు ప్రకటనములను గావించెను. పంజాబులోని ప్రజాసామాన్యముగూడ యీదురవస్థలలో ఈమహాపురుషుని స్నేహమును, సానుభూతిని పొంది ఆఘాతములబాధలను మరచిపోవుటకు ఆయనఆగమనముకొరకు అత్యాతురతతో అపేక్షించుచుండిరి. విశిష్టపంజాబీనాయకులు వచ్చి బొంబాయిలో గాంధీజీని దర్శిం

డిరి. పంజాబురాష్ట్రపు గాంధీజీని ప్రార్థించిరి. దీనివలన గాంధీజీ హృదయము మరింత వ్యాకులపడిపోయెను.

హింసాపూర్ణ రక్తపిపాసులగు శాసకదళము...

అమాయికులు శాంతులునగు మానవప్రాణులపై అత్యాచారములను చేయుచుందురు—వారిని కొట్టుచుందురు. వారి దేహముల దెబ్బలు వేయుచుందురు.

రక్తాక్తశరీరులు బాధచే ఆర్తనాదములు చేయుచుందురు.

వారి ఆర్తనాదములు కరుణకోమలమాతృదేవి కర్ణేంద్రియములలో ప్రవేశించును.

స్నేహపరాయణియగు మాతృదేవి విలపించుచుండును

ఆహతసంతానమువద్దకు పరుగిడిపోవుటకు వ్యాకులత పడుచుండును.

హింసాపూర్ణశాసకదళము—

అమాయిక శాంత భారతీయులపై అత్యాచారములు గావించుచున్నారు. వారిని పీడించుచున్నారు. ఆతములు వేయుచున్నారు.

అత్యాచారితభారతవాసులు బాధలచే ఆర్తనాదములు చేయుచున్నారు.

వారిఆర్తనాదములు సానుభూతిపరాయణుడగు గాంధీజీకర్ణేంద్రియములలో ప్రవేశించెను.

